శ్రీ

# కృష్ణశతకము



రచయిత

శర్మశ్రీ



ముద్రణ
కమలా కుటీర్ (పవర్) ప్రెస్
నరసాపురం



శ్రీ కామేశ్వర పబ్లికేషన్స్
పెంట్లం

# అంకితం

ఈ నా ద్వితీయ కావ్యకుసుమాన్ని భక్తితో

సీ. గోకేటి విఖ్యాత కులదీపకుండైన
ఘనుఁడు సూరయ్య యేవనిత తండ్రి
మాననీయ మహనీయ గుణనికేతన సుబ్బ
మాంబిక యే సాధ్వి కనుఁగుతల్లి
ఘనదానధర్మసత్కార్యానురక్తుండు
కామేశ్వరాఖ్యుఁ డేకాంత భర్త
పరమ పాతివ్రత్య భావంబుఁ గరుణ యే
కాంతామతల్లి యాకారగరిమ

తే. ఏ లలన యున్నతంపు టిల్లాలితనము
ధరణిలోఁ బెరసతుల కాదర్శమగును
యా జనని యన్నపూర్ణకు నంజలించి
అంకిత మొనర్తు నీగ్రంథ మధికభక్తి.

# అభిప్రాయము.

ప్రస్తుతం శతకాలు ప్రధానంగా రెండు రకాలుగా విభజింపవచ్చును. భక్తిరస ప్రధానాలు, నీతి బోధకాలు. రామశతకం, కృష్ణశతకం, దాశరధీశతకం, ఈలాంటివి మొదటి తరగతిలో చేరతాయి. కుమారశతకం, సుమతీశతకం, వేమనశతకం మొదలయినవి రెండోరకంలో చేరతాయి. కాని భక్తిరసప్రధానమైనవే హెచ్చుగా కనబడుతున్నాయి. వీనిలో భక్త్యావేశాన్ని ఎంతగా రప్పించగలిగితే అంత హెచ్చుగా కొనియాడబడతాయి. ఈ బాలకవి చి. కృష్ణనాశిష్యుఁడు భక్త్యావేశపూరితుఁడు. కవితోత్సాహం వీనిలో ఉరకలు వేస్తూంది. భావప్రధానంగా చూచుకుంటూ ఒక ఆవేశంలో రచన సాగించేటప్పుడు ఛంధోనిబంధనలొకప్పుడు సడలవచ్చు. అట్టిచోట్లు విస్మరించతగ్గవి. ఈశతకం చదివిన కొద్ది ఇంకా చదవాలనిపించేటట్టుంది. ఇంతకన్న శిష్యుని గురించి చెప్పటం ఆత్మస్తుతి అనిపించుకుంటుందేమో. ఈచిరంజీవికి జగన్మాతయగు పరాశక్తి ఆయురారోగ్య భాగ్యము లందించి అనర్గళ కవితాశక్తి నందచేసి మాతృభాషా సేవ చేయించుగాక యని కోరుచున్నాను.

ఇట్లు

కవిభూషణ ఆంధ్ర శేషగిరిరావు

నమశ్శివాయ



# కృష్ణ శతకము

శ్రీకర! మునిమానసమో
దాకర! జితనీలనీరదశ్యామా! ల
క్ష్మీకాంతా హృద్రమ్య
శ్రీకైరవకైరవాప్త! జేజేకృష్ణా!

భువి జక్రవతపు వంశో
ద్భవు శాస్త్ర నిగమ పురాణ పారంగతునిఁ
కవివరుగురు వేంకటరా
య, విబుధవర్యు గొలుతు ననయంబును కృష్ణా!

వాణిని శాస్త్రనిగమచయ
పాణినిఁ బద్మజురమణిని ప్రాకట సుగుణ
శ్రేణిని పన్నగసన్నిభ
వేణిని మృదుపలుకు లొసఁగ వేడెదు కృష్ణా!

అసదృశ కవితా సృష్టులు
పస నొసరించియు వెలుంగు భాసుర కవిలో
క, సుధాకరులకు మ్రొక్కి, స
రసత శతకమును రచింతు రాధాకృష్ణా!

అదియిది యనగను కుదరని
మదినొక నలత జెలఁగి యరమరకలు వెట్టన్
బెదరియు నుపశమనమునకు
మది యలరఁగ నిది నుడివెద మాధవకృష్ణా!

పాదోద్భవ గంగాఝురి
మోదముతో శిరమునందుఁ బూనుటగాదే
సాదృశహీనమహామహి
మా దారియగుచు వెలుఁగు నుమాపతి కృష్ణా!

సతి సుతహిత జన జలచర
యుతమగు సంసార పంకిలోదధిగడువన్
తతనీసంస్మృతి నౌకా
ప్రతిపత్తియు లేక మాకు వశమే కృష్ణా!

వైష్ణవమాయాగుణ వ
రిష్ణుత జాటఁగ నుమాపతిష్ఠున మాయా
విష్ణాతు న్మోహినివై
ధృష్ణత బాపవె విలాస ధుర్యతఁ గృష్ణా!

సిరిగల రోజులలోనన్
హరినామ స్మరణ గల్గ దద్ది హరించన్
దరిఁ జేరంజూతురు గద
మరి దీనజనావనాఖ్య మహిమది కృష్ణా!

నిరతము నిశ్చల భక్తిని
జరగుచు భవబంధ విదళపరిధవయుతమా
హరి పాదాంభోజాతత
స్మరణాసక్తుఁడగు వాఁడె మాన్యుఁడు కృష్ణా!

గోవు లుపనిషత్తు లరయ
నీ విల దోగ్ధవు కిరీటియే దూడ మహా
పావనగీతయె దుగ్ధము
ద్రావిన మోహమడఁగునట ద్రావెద కృష్ణా!

దేహము నిత్యము గాదని
యూహాల నెఱిఁగియు గణింప నోపముగాదే
మోహావహవివశులమయి
శ్రీహరి పాదారవింద చింతన కృష్ణా!

విను పూర్ణము బ్రహ్మము
అనలము బ్రహ్మము, హవిస్సనది బ్రహ్మమగున్
ఘనతర ఫలమది బ్రహ్మము
యొనరించెడివాడు బ్రహ్మయునగును కృష్ణా!

సర్వము బ్రహ్మమయంబగు
నుర్విని కర్మమున బ్రహ్మయూహయునున్నన్
దుర్విషయ విముఖుఁడైనను
నురవర బ్రహ్మపద భాగ్యమొందును కృష్ణా!

భవదీయాకృతి భయ, భ
క్తి, విధేయత లలర నిలిపి స్థిరముగ మదిలో
భవ పాశంబులు దెగ్గ్లగ
సవినయమున సన్నుతింతు సతతము కృష్ణా!

జ్ఞానికి సర్వము బ్రహ్మము
తానొనరించెడి పనులును తత్ప్రీతికినై
మానుగ బొందెడు ఫలమును
తానంకిత మెచ్చు నెపుడు దానికె కృష్ణా!

కాలము గడుపంగ కర్మము
లోలి వటించు ఫలరక్తి నొడంబడం డెపుడున్
మేలును గీడును బొందం
జాలక పరమున కలియును జ్ఞానియు కృష్ణా!

ఈ మఖమును జేయుదు నే
నీ మఖఫలముగ గనుదు వనేక సుఖములన్
కామిత భోగముల మరంగ
తామది నెంచును జడమతి తప్పక కృష్ణా!

జీవునిగ వెలుంగువాడును
దైవాంశమునై శరీరధరుండై యలరున్
"జీవో దేవ సనాతన"
భావము గ్రాహ్యము గదర శుభంకర కృష్ణా!

అన్మాంశు వెలియునయి స
ర్వాత్ముఁగ వెలుఁగుటఁజేసి ప్రాభవమున భా
సాత్ముండ వగుట నిల బర
మాత్ముఁ డనుచు విబుధవర్యు లాడరె కృష్ణా!

లీలఁగ మాయాశక్తిని
గ్రాలుచు చిన్మయ స్వరూపకలితుఁడ వగుచున్
నేలను నింగిని నన్నిఁట
జాలియు నుంటివి పొగడవశమె నిను కృష్ణా!

పదునాలుగు భువనంబుల
నుదరమునిడి దేవకి సతి యుదరములోనన్
ఉదయించితి వెన్నెలో దానవ
కుదురుకు చిద్రూపుఁడనుచు గొలువఁగ కృష్ణా!

జ్యోతకమువ్యోము శత్రుయ
జ్యోతుల కవ్వల వెలిఁగెడు జ్యోతివగు బరం
జ్యోతిని తేజోధారివి
జ్యోతిర్మయ రూపివిగద శుభకర కృష్ణా!

చూచుట సులభము మదిలోఁ
జూచుట నేర్చిన నయనను జూచుట కేలా
దోచుట తనుదానే లోఁ
జూచుటయే, చూచుటకద చోద్యము కృష్ణా!

విలువైనది విజ్ఞానము
విలువైనది కాదు కాని చోద్యము నరజ

న్నలకే యధికారంబును
గలదు తెలియ తెలియఁగవలె ఘనముగ కృష్ణా!

ఏ తెలివిని తెలిసిన నీక
నే తరిఁ దెలియనగు దెలివి యిల మిగిలియు పో
దా తెలివిని తెలిసికొనుట
యే, తెలివియని తెలియవలె నెదలో కృష్ణా!

తగువారల వేడినపని
యగుఁగా నందరని జూచి యాచించుటయున్
తగునే సర్వాధిపతివి
యగుటను నిన్నే నుతింతు నరయుము కృష్ణా!

దారులు వేరగు గమ్యము
నారయ నొక్కటె కనుగొన నభిమత గతులన్
జేరుదు రవ్వియె మతముల
దారులు దోచిన విధముగ దప్పరు కృష్ణా!

కోయిల చేరని వనమును
ధీయుతులుండని సభ కవిధీరులు నరుదా
నాయూరును ధరన్యాయము
జేయని దొర, పురి దగదు వసింపఁగ కృష్ణా!

పరసత నెఱుఁగని సానియు
వరవాక్చాతురిమ లేని పండిత జనుడున్
పరితుష్టుల జేయని కవి
వరుఁడును రాణించరుగద! వసుధను కృష్ణా!

ధనమును విద్యయు గలుఁగని
మనుజుని స్వజనులునుగూడ మన్నింపరుగా
ఘన విషదంష్ట్రలు వడిఁ బెర
కిన పన్నగ లక్ష్యమేమి? కేశవకృష్ణా!

అతి గర్విని గణియింపక
పతిని బ్రోక్కను పరుండ సమ్మతి సేకే
హితునకు బలుకక యుండుట
ఏమొ తెలిసిన శిశులు ముకుంద యీశ్వర కృష్ణా!

అతి వాచాలత గూడదు
సతము మాభావమున నుంచు సత్పురుషు భయా
న్వితుగ దలంచును లోకము
తత నిజము గ్రహింపలేమి తథ్యము కృష్ణా!

పతులకు జిక్కిలి నీతులు
గరపుట కడు తేలికయె ప్రకటముగ తానా
చరణం జూపుట కష్టము
కరి భయ హార! శ్రితభవహార! కారణ కృష్ణా!

అల కాళీయుని శిరమున
పలు విధముల నాట్యాభినయ పావన పాదం
బులు మదిఁ బాయక గొల్చెద
నిల భవబంధము లుడుగఁగ నెంచియు కృష్ణా!

హరిహర రూప విభేదము
వరలుగ లేదని తెలిసియు స్వాంతములోనన్

వాసుడన నభిమానంబిల
నురవగు నదియేమి చిత్రమో కద కృష్ణా!

ఎనను నిరువుర సమముగ
మానసమున దలతుగాన మానక నిన్నున్
నే నోపినటులఁ బొగడుదు
మానుగ గ్రహియించవయ్య మాధవ కృష్ణా!

కలలోఁ బొడఁగని కతకముఁ
బలికించుట నరయ నీకు భక్తుల పాలన్
వలమాలిన ప్రేమ యనుచుఁ
దలఁపగ వచ్చును మనమునఁ దప్పక కృష్ణా!

జనకుని మొక్కఁగ సిగ్గిలు
తనయుఁడు నడివీధినిబడి తడబడు సానిన్
జనకూటమిఁ జేర వెఱపుఁ
గను పిరికియుఁ బైకిరారు గదరా! కృష్ణా!

పరుల ధనమ్మును గుడుచుచు
దొర నీయూరికి వటంచు దుందుడుకొప్పన్
చరియింతురు కొందఱు మరి
సరుకుండని యాకెగిరెడి సంగతి కృష్ణా!

మదమున మెలఁగెడు భార్యయు
నెదురు బలుకుచు నిరసించు నే సోదరియున్
కుదురుగ పాలీనొల్లని
మొదవు నవశ్యము విడుచుట బోలును కృష్ణా!

కుక్షిం గోసియు గాంచిన
నక్షరముండదు మరేల నన్నిఁట నేనే
దక్షుఁడపంచాడు తులువ
సిక్షితి నెటు మందలింతు వీవో కృష్ణా!

పిలిచినతోడన పలికిన
తొలఁగును దొర కీవి యనచు దోర్గర్వములన్
అలరఁగ పరధ్యానంబున
మెలఁగెదు మందమతులుండిరి మేదిని కృష్ణా!

తెలసినవాఁడైనను మఱిఁ
తెలియనివాఁడైన బ్రతుకు తెరువులు దెలియున్
తెలిసియు తెలియని మూఢుఁడు
తెలియక మిడిసిపడుచుండు తేలఁడు కృష్ణా!

గిల్లలు వెరకిన కుక్కను
పిల్లలతోడనవసించు బెబ్బులిని యిలన్
జిల్లర తిరుగుడు తురగిన
పిల్లను నమ్మదగదు రిపు భీకర కృష్ణా!

జ్ఞానవిహీనుఁడై ధారుణి
దీనుఁడు ధన భోగ భాగ్య దివ్యసుఖములన్
గానని వాఁడు దరిద్రుఁడు
గా నిల దీనుండుగాడు కదరా కృష్ణా!

గోవింద కథా మధుర సు
ధావరధారానురక్తిఁ దవిలినవాఁడే

పావన చారిత్రుఁడు దీ
నావనభావన! ముకుంద! హరి శ్రీ కృష్ణా!

చతురంభోధిపరీతవ
సతి భూతల మెవ్వాని నిజచరణాశ్రయమై
వృతమై వెలుఁగొందెడు న
య్యతుల మహిమయుతు భజింతననిశము కృష్ణా!

పాలింపను లాలింప ము
రాలింపంగా సమర్థుడాఢ్యుఁడ వీవే
పాలింపవె శరణంటిని
లాలింపవె యభయమిచ్చి లలి శ్రీ కృష్ణా!

కోరను ధనధాన్యంబులు
జీరను ఘన భోగభాగ్య సిరిసంపదలన్
గోరెద భవబంధంబుల
జీఱెడి పాదారవింద చింతన కృష్ణా!

జలజాకర సలిలంబుల
దళలహరీ ఫేన బుద్బుదంబు లాదవి త
జ్జలమున కలియు గతిని ని
ర్మల సృష్టిని జీవులుండి మలఁగును కృష్ణా!

శ్రీ రమణీ కుచ రంజిత
సార సుగంధ మృదులిత తుషార నిమగ్న
స్ఫారోదార విలాస ప్రి
కారా! శ్రితజన భయహర కారణ కృష్ణా!

తారకము జటులతర సం
సారవిదారక సుజన సన్నుత ముని హృ
చ్చారకము ముకుందు శుభా
కారముఁ గోరి వినుతింతు హరి శ్రీకృష్ణా!

పావన గీతా క్షీరము
ద్రావిన ధీరుఁడు కిరీటి ధన్యుఁడు సుమిత్రా
తావక తత్త్వము దెలిసిన
బోవును భవపాపపాశములుగద కృష్ణా!



నందయశోదల నయనా
నందకర! మునిజన హృద్వనజమోదకరా!
సుందర విగ్రహా! హరి గో
వింద! ముకుంద! వినుత త్రివిక్రమ కృష్ణా!



శ్రీధర! కేశవ! వామన!
మాధవ! శౌరి! పురుషోత్తమ! హరి! హృషీకే
శాధోక్షజ! మధుసూదన!
సాధు జనావన! మునిజన సన్నుత కృష్ణా!

శ్రీసతి పాదము లొత్తఁగ
భాసుర కాంతులను కౌస్తుభమణి వెలయ నా
భీ సరసీజంబున విధి
యాసీనుఁడ వనురగమున నలరవె కృష్ణా!

దయ్యము దయ్యమనంగా
నెయ్యెడ వేరుం గలుగున యింటెని దయ్యం

గయ్యాళి సతియ కదరా
దయ్యము సుజనవినుతోన్నత చరణ! కృష్ణా!

బాలుఁడ నీతులు జెప్పఁగ
జాలనుగాన వచియింతు శైశవ కేళీ
జాలము కరుణించియు నన్
పాలన జేయుము శ్రితజన బాంధవ కృష్ణా!

నేలను తినుటయు నేలన
నేలయె నాలోన నుండు నేలనె గుజుకున్
జాల వీఁకేమని నోటను
నేలను జూపితె జననికి నెమ్మది కృష్ణా!

మాయల పుట్టగు దిట్టను
మాయను గ్రిమ్మఁగ బసులను మరి కాపరులన్
మాయము జేసిన ధాతయె
మాయంబడిపోడె మున్ను మాధవ కృష్ణా!

ప్రేమారఁ బిలువఁ బంపిన
మామను దరిఁజేరి చీరి మడియఁగఁ గొట్ట
న్నేమాత్రము ధర్మంబగు
దామోదర! నీరజాక్ష! దయంగను కృష్ణా!

వృక్షమ్ములు రెంటికి నిజ
వక్షస్థలి మోపిడి చిరుపాపని లీలన్
దక్షతఁ ద్రోసిన ఫెళఫెళ
నీక్షితి వ్రాలెవె! ఘను జగదీశ్వర కృష్ణా!

నీవెటు జేసిన లీలలు
నా విలఁ బిచ్చి పనులౌను మాకును నీకుఁ
ఈ వైరుధ్య మదేమిటి?
పావన చరణా! శ్రితజన భయహార! కృష్ణా!

ఓంకారమయ స్వరూపా!
శంకర వనజోద్భవముఖసన్నుతభావా
పంకజనాభా! ప్రథిత, శు
భంకరనామా! శ్రితజన బాంధవ కృష్ణా!

జలకం బాడఁగఁబోవ
న్నల యమ్బారుని కరయుగ్మమందు నసతి కృపా
కలిత స్వాంతుడవై లీ
లల దర్శన మీవె కృప చెలంగఁగ కృష్ణా!

ఈరేడు జగము లేలెడి
పారగుణు సుతునిగఁ బొదవి సాకెనన యశో
దారమణి సుకృత మెన్నఁగ
నేరుదుమే విశ్వనాథ! నిర్గుణ కృష్ణా!

బొడ్డునఁగల నలుమోముల
బిడ్డకు సృష్టి విధమెల్ల వేళలఁ దెలిపే
దొడ్డవు వేడుక బుట్టిన
బిడ్డగఁ దిరుగంగ గొల్లవీటిని కృష్ణా!

వెన్నయును మీగడ పెరుగును
నెన్నఁగ పాలును గుడువఁగ నిత్తురి మనసా

యున్నదె హా! కాలబలిమి
నిన్నను బంధించు నొక్కొ నిచ్చలు కృష్ణా!

పాలను ద్రావు మటంచును
బాలఁగ పాలిచ్చు రాక్షస యువతి నపు సుక్
ీలగ పాలను నిజ ప్రా
ణాలను బీల్చితి వఁట తగునా హరి కృష్ణా!

ధనమది మిక్కిలి గూర్చిన
జనునా నావంతయును వెను జని వచ్చునె? క
ష్టానఁ గేవలమది జంజా
టన దప్ప మరేమి ప్రస్ఫుటంబుగ కృష్ణా!

ధనమార్జన సేసెడి వే
ళను నాకసలు మరణము హుళక్కి యటంచున్
ఘన దానధర్మముల వే
ళను లేపే జత్తునని దలఁపవలె కృష్ణా!

పరకాంతల దల్లులవలె
నరయవలె నటందు గోపికాంగనలను నె
ట్లరసితి వీవు నిజము నుడు
వర గోపాల! యవినీతిఁ బరగవె కృష్ణా!

బాలుఁడవై నిఖల భువన
పాలుఁడవై యిల యశోద భామిని సుకృతా
జాలుఁడవై రేపలి గో
పాలుఁడవై యలరు నిన్నుఁ బాడెదు కృష్ణా!

ధైర్యము వీడక నిరతము
ధైర్యంబున బరుప కార్య తత్పరుఁడైనన్
కార్యము దప్పక జరుగు న
వార్యంబగు దైవబలము బడయుము కృష్ణా!

మానవ పూనిక మొదలే
లేనిచో దైవంబెటుల ఫలించును మదిలో
దీనిని దలఁపక లేదని
జ్ఞానవిహీనత తలఁతురు సత్యము కృష్ణా!

కర్తా కర్తవు గాఁగా
వర్తింతువు గాదె సత్యభామా గర్వ
స్ఫూర్తిని బాపఁగ నారద
మూర్తి నియంతగ నిలుపవె మురారి కృష్ణా!

నారివిపీరినిఁ బోర్చిన
భీముఁడవంచును శరముల నుతించితి వడి న
ప్రీతియు గావకనున్నను
నేరను నీమహిమ నమ్మ నిజముగ కృష్ణా!

తెగువతనుఁ ద్రాపు బిగిం
చెఁగఁ దగదు సుమా! ముకుంద! సత్యాగ్రహముగఁ బో
వఁగ చూచుచు భక్తుని స
త్వగుణ విరాజిత గుణరహితా! హరికృష్ణా!

అరిషడ్వర్గము జేయుము
ధర ముక్తిప్రద-మహిత-పదద్వయ నిజసం

స్మరణ విడువఁగ నశక్యం
బిఱుకటమునఁబడితిని దయ నేలుము కృష్ణా!

నాలుగు విధముల భక్తులు
జాలఁగ గొల్చెదరు నిన్ను జ్ఞానజిఘృక్షుల్
పాలిత కాములు నార్తులు
గా లలితజ్ఞులు వచింత్రు శాస్త్రతతి కృష్ణా!

కామాతుర బుద్ధిని మే
మే మాలిన్యం జెఱుంగ మెన్నఁగ సత్వ
స్తోమం బుడిగిన దెలియు న
దేమో యూయఁగ బలుకుము విమ్మోయి కృష్ణా!

పసఁ దెలియు బనులకు శివుని
యుసు కొల్పుచు పాలు పెరుగు లూరక గొల్లన్
విసువుగ బోదువు మరతుమె
విసము గుడుచు సంఘటనను వీసము కృష్ణా!

కన్నుల కాళుల చేతుల
నన్నుల మిన్న లిల సైగ లాడఁగ వనజో
త్పన్నునకైనను దెలియునె
కన్నెల చేష్టలు విచిత్రకరముగు కృష్ణా!

దేహము శాశ్వత మంచును
మోహమునఁ దలచెడివారు మూర్ఖులు ధరణిన్
దేహము బోవుట నెఱిఁగియు
మోహమున దపించువారు మూఢులు కృష్ణా!

ఇతరము దలఁపక మదిలో
సతతము నిన్నే కొలిచెడి సత్పురుషులకున్
వితరణ లేకయె బంటుగ
సతతి విడువక చరియింతు వటరా కృష్ణా!

కోరిక లుడిగియు నాత్మన్
జేరిచి మనమును స్థిరముగ చింతన చేయ
న్నేరుచు సత్పూరుషుఁడే
యారయ నారూషుఁడనగ నప్పుఁడు కృష్ణా!

భేదములేకను సర్వము
నాది పురుషవరు స్వరూపమంచును మదిలో
మోదించెడి సమదర్శన
మేదుర భావము గలుగుట మేలగు కృష్ణా!

అదుపాజ్ఞలు లేకను దా
జెదర దిరుగుమదిని విషయచింతల నెడలన్
గుదియించుచు నెమ్మది నె
మ్మది దైవపరంబు సలుప మలగును కృష్ణా!

ఊపిరి వోయెడి వేళల
నోపము హరినామ చింత నొనరింపంగా
నా పరువంబున కిప్పుడె
నీ పద సేవలు సలుపుదు నెమ్మది కృష్ణా!

జలమున బడు లవణకణము
జలరూపము దాల్చుగతిని సర్వస్వము ని
శ్చల మనమున దైవార్పణ
మిలఁ జేసెడి వాడె భక్తుఁడెన్నగ కృష్ణా!

నమ్మక గావలె మును గ
ర్వమ్మది పోవలె పయి నరి వర్గము దొలగున్
నెమ్మది భక్తి గుదురు స
త్యమ్మది తెలిసిన పురుషుఁడు ధన్యుఁడు కృష్ణా!

తను తా నెఱిఁగియు క్రీడిం
చును మదిలో ముదమున మఱచును తనగతియున్
తనకే కోర్కెలు గలుగక
నిల నారూఢస్థితి సిల జరగును కృష్ణా!

వేదంబులు శాస్త్రంబులు
దాదరి ముట్టఁ జదివియును తత్సారంబౌ
ఆది విరాట్టు నెఱుఁగరు ప్రి
సాదమునకై దిరుగు గరిట సంగతి కృష్ణా!

పనిబడి యేగియు నచ్చో
టను జేరి తిరిగియు వచ్చుట మరచుగతి నే
లను జన్మము దాల్చితినని
మనమున నెంచడు బురుషుడు మాయగ కృ ష్ణా

జ్ఞాన స్వరూప దాతవు
ధ్యానవిధానుండ వీవు దక్షయు భక్తిం
బూని శివ కేశవు లొకటి
గా నెఱిగినగాని శుద్ధిగాదుర కృష్ణా!



దివ్యము భవ్యము మునిజన
సేవ్యము నిఖిల భువనతర శ్రేయోప్రద బాం
ధవ్యము వనజోద్భవ శివ
స్తవ్యమగు శుభాకృతి మది దలచెదు కృష్ణా!



విశ్వేశ్వరు, విశ్వాలయు
విశ్వేతరు, విశ్వలోలు, విశ్వాకారుఁ
విశ్వపతిని, విశ్వగతిని
విశ్వుని, ఘన విశ్వమయుని వేడెద కృష్ణా!



కవితా మాధుర్య సుధా
నవధారలు దయనొసంగి నన్నిలఁ బ్రోవఁ
భవదీయాకృతి గొలిచెద
నవని గరుణగొని మొఱవిని వరయుము కృష్ణా!

తత సత్కవితా ఘన ని
ర్మిత భవ్యచరిత్రులందు మేలగు స్థానం
బిక రవ్వంతయు లేదుర
క్షితి నీ నామస్మృతి నిటు జేసితి కృష్ణా!

సృష్టి స్థితి లయకారణ
దుష్ట దురిత సంయుత భవ దుర్గతి హారణా
శిష్ట జన వినుత చరణా
సురేంద్ర నిమిషేంద్ర వినుత శరణా కృష్ణా!

ఇది శ్రీ చక్రవరం వేంకటరామరాయ గురు కరుణా కటాక్ష
లబ్ధ కవితా ధారేయ కాశ్యప సగోత్ర పవిత్ర కపిల
వంశాంబుధీ సుధాకర శ్రీ కామేశ్వరసూర్య
నారాయణార్య ప్రియ మధ్యమ పుత్ర కృష్ణ
శర్మ నామధేయ ప్రణీత
శ్రీకృష్ణ శతకంబు
ఓం తత్ సత్ !

